శ్రీమత్త్ర్యంబకేశ్వరాయనమః

# త్ర్యంబకేశ్వరశతక[redacted]

కేసనపల్లి లక్ష్మణకవి ప్రణీతము

ప్రథమ ముద్రితము 500 ప్రతులు.

నరసరావుపేట

కోటీశ్వర ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1936

భక్తిరసప్రధానము] [వెల రు 0-2-0

శ్రీమత్త్ర్యంబకేశ్వరాయనమః

# త్ర్యంబకేశ్వరశతకము

కేసనపల్లి లక్ష్మణకవి ప్రణీతము

ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

నరసరావుపేట
కోటేశ్వర ముద్రాక్షరశాలయందు
ముద్రితము.

1936

భక్తిరసప్రధానము]

[ వెల 0-2-0

# పీఠిక.

ఈ శతకము రచించిన లక్ష్మణకవి శతమన్యుఁడు గుంటూరు మండలము నందలి నరసరావుపేటతాలూకాలోఁ జేరిన కేసనపల్లి గ్రామ నివాసి. వాసిగల యాజువేల నియోగి యోగిమాళిగయిఁగు శ్రీవత్స ముని గోత్రోద్భవుఁడు.

మఱియు నిక్కవి కుంజరుఁ డాశ్రిత శుక పంజరుఁడగు నాంజనేయ వరప్రసాది సాదిసాది వాదించుట యందఖండ ప్రజ్ఞగలవాఁడు కలవాఁడు గాకపోయినను గవిత గలవారికిఁ దక్కఁ దక్కఁగల కలవారికి లొంగు వాఁడు కాఁడు.

ఇట్టించిన వహి వహించిన యీయన కవిత్వము మృదుమధురమై సులభ భావ బోధమయ్యును యమకాను ప్రాసాది శబ్దాలంకార సహిత మగుట సమంజసము మీఁదుమిక్కిలి యేకవృత్తమునే వాడుచు యతి స్థానము మకుటస్థము జేసినను నియమ కృశీభూతగాక పరిసమాప్తివఱకు హృదయంగమ మగుట కడుంగడు బ్రశంసనీయము.

భాషా యోషామణికి భూషా విశేషమనఁదగు నిట్టి యుద్గ్రంథము రచించి శాశ్వతకీర్తి ప్రతిష్ఠలు దక్కించుకొనిన యీ సుకవిచారిత్ర మింతమాత్రము పాఠకలోకమున కెఱిఁగించినందువలన కృతార్థుఁడను.

కేసనపల్లి,
నరసరావుపేట తాలూకా
29-9-1936.

పౌరాణిక శిరోమణి,
నందిగల సుబ్బారెడ్డి.



శ్రీమత్త్ర్యంబకేశ్వరాయనమః.

# త్ర్యంబకేశ్వర శతకము.



శా॥ శ్రీకర భక్తమానస వశీకర సద్గుణ రత్నపుంజ నీ
రాకర దుర్మదాసుర నిరాకర భీకర పాపవాయు ద
ర్వీకర వారిజోదర విరించి ముఖామర వందిత ప్రభా
వా కరుణాకరా పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 1

ఉ॥ కార్యముమాని నీకు నుతిగా శతకమ్మొకఁడేను వ్రాయఁగాఁ
గార్యము బూని విశ్వహిత కాంక్షులు గావునఁ బ్రస్తుతింతు, నా
శ్చర్య రస ప్రసారయుత సత్కవితా రచ నాఢ్యులౌ సుధీ
వర్యుల నార్యులన్ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 2

ఉ॥ పాక మృదుత్వముల్ లలిత భావసమగ్రత గూర్పనేర్ప నా
నా కమనీయ శబ్దకల సమ్ము లసద్రస పుష్టి దుష్టిగాఁ
జేకొన కట్టికావ్యము హసించెదు కాకవులన్ గణింప, శ
ర్వా! కకుబంబరా! పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 3

ఉ॥ తారిసుమంత నేరకయె తప్పనియందురు తప్పటాటకున్
గారణమడ్గుచో మొగమె కానకపోలిక, సూలుకొల్పి ని
స్సారము లుగ్గడింతు రవి చాలులు; వారి వికారమార్ప నె
వ్వారికి సాధ్యమౌ పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 4

ఉ॥ సాంగముగా సమస్తవిధ శాస్త్రములుం బఠియించి రంగులౌ
హంగులుగూర్చి కూర్చి కృతి నచ్చుగ నెవ్వఁడొ వ్రాయఁగాక, వే
భంగుల నీకువర్ణనకుఁ బాసినఁ దత్కృతిలోనఁ దాన భి
ష్వంగము భంగమౌ పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 5

॥ శోకము వీచ్చునా? జయము సొచ్చున? సంసృతిబాధ చచ్చునా!
లోకముమెచ్చునా? దివిజలోకమువచ్చున? కీర్తిహెచ్చునా!
పాకము గుర్తెఱింగి నుతి పాత్రము నీ సుచరిత్ర మెయ్యెడన్
వాకొన కున్నచోఁ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 6

ఉ॥ సూనశరున్ సురూపమున సూర్యునిఁ దేజమునందుఁగాంతి స
జ్జానినిఁ బోలుగాక నిరతంబు నినున్ భజియింపడేని న
మ్మానవుఁ డారయంగ నొక మానవుఁడా కొఱగాని యాతఁ డే
వ్వానికిఁ గానికిం బెసర వాయిపురస్థిత త్ర్యాబకేశ్వరా! 7

ఉ॥ మీఱినవీఁక భూపతుల మేకొనిసన్నుతి సేయువారు వే
యాఱుల గౌరులన్ మఱియు యారుల నిత్తురు నీవొ మోక్షమున్
జూఱయొసంగు దంపనె సూరివరేణ్యులు నిన్నుభక్తి దై
వాఱనుతింతురో పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 8

ఉ॥ రుద్ర దయాసముద్ర బహురూప వికార విదూర సార ని
ర్ణిద్ర నిరంతరస్మరణ రీత్యను మోదిత రామభద్ర య
చ్ఛిద్ర యశోఽధిముద్ర పరిసేవితభద్ర యొసంగు భక్త దే
వద్రుమ భద్రముల్ పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 9

ఉ॥ వాని హృదబ్జభృంగ లసమాన దయా కలితాంతరంగ గో
జానితురంగ వారణ నిశాట విభంగ, ధరాశతాంగ మో
దాను గతప్రసంగ వినుతార్జున తోజ్వలితాంగ లింగ దే
వా ననుఁ గావరా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 10

ఉ॥ అండజవాహరోప, కన కాచలచాప విధూతపాప మా
ర్తండ శతప్రతాప ద్విజరాజకలాప మనోజ్ఞరూప ని
న్నొండన నోప నీవెదయ నూనక నన్నిటులేప నాకిఁ కె
వ్వండు గలండురా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 11

ఉ॥ దంభవినాశ యీశ గుణ ధామ వినిర్జితకామ సత్క్రియా
రంభ సుధాశనప్రచయ రక్షణ లక్షణ పుణ్యవీక్షణా
జంభ విపక్షసన్నుత లసద్ధృదయాంబుజ ధార్యమాణ వి
శ్వంభర బంభరా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 12

ఉ॥ సార విచార ఘోరతర సంగరశూర యుదార నిర్మలా
కార సుమేరు ధీర ధృతకాతర రక్షణభార పర్వతా
గార వికార దూర యురగ ప్రభుహార జితారి వార దు
ర్వార విహారయో పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 13

ఉ॥ శైలసుతా కళత్ర రవిచంద్ర హుతాశన నేత్ర పాపజం
బాల సరోజమిత్ర పరిపాలిత సంయమి పుత్ర సర్వ భూ
పాలన పాత్ర దాసజన పాదపచైత్ర ధనేశమిత్ర నగ
వాలెము సాకరా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 14

ఉ॥ హాసవిశేషణా గురుత రార్థ సమన్విత దివ్యభాషణా
భూసుర పోషణా సవన భుక్ప్రకరాభి నుత ప్రతోషణా
భాసుర ధర్మకర్మ పరిపాక నిరోధక రాఘ శోషణా
వాసుకి భూషణా పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 15

ఉ॥ హెచ్చిన వేడ్కతోడ నెవఁడేనియు మోక్ష పదంబుఁజెందఁగాఁ
జొచ్చిన యుష్మదాశ్రయమె నూడవలెన్ నిగమాంతబోధనుల్
మెచ్చిన దారిఁజేరి పసమించిన చూపున నెన్నియాపదల్
వచ్చినఁ జచ్చినన్ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 16

ఉ॥ మేర దలంపరాని బలిమిన్నలిమించి సురల్ నిశాచరుల్
వారిధిఁ ద్రచ్చుచో గరళ వహ్ని జనించిన దాని మ్రింగితే
దారిని బోల్ప వీల్పడెడు ధైర్యసమగ్రిమ నీకు సాటిగా
వారిని వీరినిన్ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 17

ఉ॥ నీ సఖుఁడైై తనర్చుటఁ గనేఁ ధనసంచయ ము౯గుబేరుఁ డు
ల్లాసమెసంగ నాతఁడొక లక్ష్యమె యెవ్వఁడెగాని నీ పదా
ర్చాసము పేతుఁడైనయెడ సర్వవిధంబుల ధిక్కరింపఁ డే
వాసవు గీసర్వు౯ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 18

ఉ॥ ఈ రసమూని నిన్ను జగదీశ్వరు సర్వ ఫలప్రదాయకు౯
నీ రసుఁడంచు నెంచు గువినీతుని దక్షునిఁ ద్రుంచియుజ్ఞ సం
స్కారము రూపుమాపి కడఁగాంచితి వంతట బోకదేవతా
వారము సారము౯ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 19

ఉ॥ ఏతటి విన్నఁ బ్రాభవ నీయక నీ యకలంక శక్తి ఖ
ద్యోతుఁడు ద్యోతమాన కర యోగముచేఁ గమలంబుల౯ బలెఁ
బ్రీతిగ నిత్యము౯ వికస సంబొనరించుచున్న నీవు సేవక
వ్రాతము చేతముల్ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 20

ఉ॥ ఏరుగలారు శూలిఁ జలియింప నలంపఁగఁ జాలునట్టి బల్
వీరులు నేనగాకనుచు వీఁగుచు వాఁగుచు వచ్చివచ్చి నీ
చేరువఁజేర రూపడఁగఁ జేసితివౌర యఖర్వగర్వ దు
ర్వారుని మారునిం బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 21

ఉ॥ ఎన్నఁగఁ దిన్నఁగ౯ దవిలియించుక కాలము భక్తియుక్తిమై
నిన్ను నుతించిన౯ గలుగు నిర్మలమౌ నెలతాల తిన్నెలు౯
గన్నుల కింపునింపఁ గల కన్నెలు బ్రన్నని హేమపున్నగన్నెలు౯
వన్నెలుఁ జిన్నెలున్ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 22

ఉ॥ ఇంకఁ గడుంగడు౯ వగల నింకఁ గనేటికి నేటికి౯ మది౯
శంక దొలంగఁ దావకవ శంకరచిత్తుఁడ నైతి లేదిఁకే
సంకట మంచునుండ దయ సల్పవదేమియొ తెల్పరాదె నా
వంకర శంకరా బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 23

ఉ॥ మచ్చికతోడఁ బేర్కొనిన మాత్రనె వచ్చుట వచ్చి చెచ్చెరన్
మెచ్చుట మెచ్చుటే తడవు మేలగు నీగులు కోర్కెకెచ్చు గా
నిచ్చుట నీకు నైజమని యెల్లరుఁ జెప్పుదు రెప్పుడింక నీ
వచ్చుట మెచ్చుటో పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 24

ఉ॥ సంతతమున్ భవద్భజన సల్పెడు భారము నాది సన్ను సు
స్వాంతముతోఁ గుమారుఁబలె సౌఖ్యరసాంబుధి నోలలార్పఁగా
నెంతయు నీ దిభార మిఁక నేటికి నూటికి నాకు నెప్పుడే
సంత రవంతయున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 25

ఉ॥ భాసుర లీల నిన్ గొలువఁ బట్టి కదా ధరణీతలమ్మునన్
వాసియు వన్నెయుం గలిగి వార్తకు నెక్కిరి యక్కిరీటియున్
నాసవ్యుఁ డున్ నిశాధవుఁడు వాలియుఁ గీలియు శౌరిగారి దు
ర్వాసుఁడు వ్యాసుఁడున్ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 26

ఉ॥ ఒంటిమి లేనిపోని పెడయుక్తులు బన్నుచు నీ మహాత్వమున్
గంటకు నేర్పసాలక వికారపుఁ గూఁతలు కూయు వారికిన్
దింటకు మీఁద మీఁద నగుదొంచెదు పుట్టువులందు బొందుగా
వంటకమబ్బదో పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 27

ఉ॥ ఎంచిన నెవ్వరిం దలఁప నేమిఫలమ్ము చలమ్ము గర్వము
న్మానుగఁ బొంపుగన్ సతతమున్ నిను ధ్యానమొనర్ప నట్టియే
కల్గినఁగఁ గ్రమ్మి నెమ్మనము గ్రాఁచెను సాసరణార్తి మాన్పి కా
నందగు మందగున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 28

ఉ॥ గారవమార నాశ్రిత నికాయ మజస్రము నెమ్మనమ్ములన్
గోరెడు కోర్కెలెల్ల సమకూర్ప జగత్త్రిత యమ్మునన్ మహా
దారుఁడవైన నీ వొకఁడు దక్కఁగ జక్కఁగఁ జర్చసేయ నె
వ్వారు గలారు రా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 29

ఉ॥ ధారుణి ధాత వాయుశిత దైవ నగంబ సురారి తేరుగా
సారథి గాc బతాకముగc జాపముగా శిఖిగా నెదిర్చి బెం
పార రుషాగ్నికీలముల కాహుతి సల్పితి దేవతా ద్విష
ద్వారము పోరమున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 30

ఉ॥ సంతతమున్ భవత్కథలు సారమతిన్ వినుచున్ గృతార్థులై
యంతట నంతటం దిరిగి యక్కటికమ్మున నాశ్రితాళికిన్
వింతగc దెల్పcగాcగల వివేకుల నాకుల పెట్టవెందునన్
వంతలుc జింతలున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 31

ఉ॥ హేలయ పోలె విప్పనిట లేక్షణ మాక్షణమంద విద్విష
జ్జాలము కాలముం గనుగదా మఱి నీవు ధరింతువేల యు
ద్వేల శిలీముఖాసనము దివ్యశరంబులుc బెన్కతారమున్
వాలును డాలునున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 32

ఉ॥ ఈ నిఖిలప్రపంచకము నెందులకై సృజియించినాcడవో
దీనిని కెంతకాలమిటు దిప్పుచు నుంచెదవో భుజక్తకాల మే
మానమొ గోచరింప దణుమాత్రము నాకొకనాకయేమి యె
వ్వానికి మానికిన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 33

ఉ॥ తేరకు నెప్పుడుం గ్రిధ మదిం బొడతేరదు నీవు నెద్దియేc
గారణ ముండcగావలయుc గారణమా ప్రబలంబు గావలెన్
సారత రోరుకారణము నన్ జనియించిన నీదుకిన్క దు
ర్వారము ఘోరమున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 34

ఉ॥ కాయిక వాచి కాత్మిక వికారము లోలి నశింపcజేసి సు
శ్రేయమొసంగు నీ మనువుc జెల్వెనయంగc బఠించునట్టి దా
వాయి యవాయిగా కస్మృత వాక్కులు పెక్కులు ప్రేలుచుండు న
వ్వాయియు వాయిరా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 35

ఉ॥ దుర్గుణ సంచయంబు మది దూఁకొన నీక నిరంతరంబునై
సర్గిక భక్తిఁ ద్వచ్చరణ సారసదాస్యము గోరి నిష్క్రియా
మార్గముసేరి నారక సమానముగాఁ దిలకించెదర్ సుధీ
వర్గము స్వర్గముర్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 36

ఉ॥ ఎంతటివాఁ డగస్త్యుఁడని యొంతురుగాని తదీయమైన కీ
లింత యెఱుంగ నేర రదియేమనఁగా నతఁ డుగ్ర నిష్ఠ ని
శ్చింత మతిర్ భవద్భజన సేయుట గ్రోలఁగఁ జాలె సూ యుద
స్వాంతము సాంతముర్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 37

ఉ॥ పంకజనాభుఁ డీ వగును బంకజనాభుఁడ వౌదు నీ విటర్
శంకయొకింత లేమి గుణసాగరు లేగను మాఱు తోఁచవగా
గొంకుదలంకు వీడి వినఁ గూడనివాదము వెంచువాఁడు దా
వంకర కుంకరా బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 38

ఉ॥ ఎంతయు మిత్రభావము వహించి నినుం దనియించి సత్కళా
వంత నిశాంతముర్ బెనగ వచ్చి నినుం గినియించి ఘోర ది
ష్టాంతముగాంచి రిపు ఘనుఁడౌట యెఱింగి యెఱుంగమిర్ సర
స్వాంతుఁడుఁ గంతుఁడుర్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 39

ఉ॥ ఏ ఖలుఁడైన సౌఖ్యమున కేని నినుర్ స్మరియింపఁ జంద్ర మ
శ్శేఖర! యందు నంగల దశేష విశేషము! దండపాణి దా
సౌ ఖలు నేరముల్ నుడువు నట్టియెడం గనునంట బల్ క్రుధా
వైఖరి లేక రిర్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 40

ఉ॥ మాంద్యము మాని కొల్తు నసమాన విలాసుని సర్వదేవతా
వంద్యుని దాసమానస నివాసుని సంతత సత్యవాక్య శీ
లుం ద్యుమణీందు వాయుభవ లోచను బాపవిమోచను న్నినుర్
వంద్యమొ నింద్యమో బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 41

ఉ॥ నిత్యము నీ పవిత్ర పద నీరజముల్ భజియించిజన్మ రా
హిత్యము సేయునిచ్చఁ జరియించెడు నా కిసుమంత సాధుసాం
గత్యము గూర్పుమయ్య మమకార వికార నికారదూర పా
ర్వత్యధినాయకా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా!

ఉ॥ నేతురటే భవన్మహిమ నిర్జరులుం దగనుగ్గడింప న
జ్ఞాత మనంత మవ్యయము సర్వజగంబు దలంచిచూడ నీ
చేతిది నిన్నుగన్గొనఁగ స్వేచ్ఛమెయిన్ విహరింపఁ జాల ద
వ్రాతము నైతమున్ పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా!

ఉ॥ ఒయ్యన నీ యనుగ్రహము నొందినవానికి లేవసాధ్యముల్
తియ్యముగా స్వమస్తము సు దేష్ణుడు నీకిడ నుద్యమించి నీ
వెయ్యముగాంచి యొక్కడ యనిన్ దివిజారి నికాయకాయముల్
వ్రయ్యలొనర్పఁడే పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా!

ఉ॥ కూడను గుడ్డగోర నినుఁ గోరకదెట్టులు నీకె నున్నదై
కూడు విసమ్ము మెక్కితివి గుడ్డయులేక దిగంబరుండవై
నాఁడవిటంట భక్తిమెయి నవ్వుట కొన్నివ్వటగాఁదలంచి న
న్నాఁడిగఁ జూడకో పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా!

ఉ॥ తానగపాలు దేహమునఁ దామరనేత్రుఁణ భర్తకంచు నెం
తే సులభంబుగాఁ దనమతిం బ్రతివాఁడు గ్రహింపనేకదా
నీ సగమేనఁ దాల్చితివి నేరకయూరక మేన నూని తే
వాసిత భాసితన్ పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా!

ఉ॥ లౌల్యపథంబు నన్నది మొలంగఁగ నీయక నాగిచిత్త చాం
చల్యముగూర్చు సంసరణ సఖ్యము ముఖ్యముగా సడల్చి నై
ర్మల్య యశోధనున్ నిను నమత్సరుఁగొల్చుట కల్లపొల్ల కై
వల్యము తుల్యమే పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా!

ఉ॥ నీ సుదలేనిమూర్తి తుదనెట్టనఁ గన్గొనఁగా విరించి బి
ట్ట్రాస వహించి మిన్ను గలయంతయుఁ ద్రిమ్మరి వచ్చియెంతయున్
గాసిలి కామ్యసిద్ధి గగనమ్మగు పుష్ప గగనమ్ముఁ జేసె నా
వాసిగ నీసిగన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 48

ఉ॥ హ్రస్వము లున్నతమ్ములగు నాకృతులొందుచు విశ్వమీనమై
భాస్వరతాని మూర్తిఁగను పట్టున వెన్నిటియె భూమనౌచు నా
త్రస్వర మున్వఁదావెలయు దాని బుతుప్రత పద్వసూత నై
నస్వత శాశ్వతా బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 49

ఉ॥ నాదియు నీవ నీవ ప్రతినాదియుఁ గార్యము నీవ మోదమున్
ఖేదము నీవ నీవ పరికింప సమస్తము నీవుగాని వే
లేదొకఁ డీ ప్రపంచమున లేశము నాదన కాదనంచు నీ
వాదము వేదమున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 50

ఉ॥ గోత్రము గేహమా విస్తృత గోపతివాహను విశ్వదేహమా
పాత్రము పుత్రమా కొలువు పట్టణముల్ కయి పేరు క్షేత్రమా
నేత్రముకృత్తి మా సరిగఁజూపగ నీ విషయంబునాకు స
ర్వత్ర విచిత్రమా బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 51

ఉ॥ ప్రాజ్ఞులు దామభీప్సిత పదమ్ములు గాంతురు నినుఁ దుష్టిగా
యజ్ఞము లాచరించి వినుమా చనుమానము లేక వచింతు నే
యజ్ఞములాచరింపఁ గలనా సలనా సనుబ్రోవనున్నిక స
ర్వజ్ఞుఁడ వజ్ఞుఁడన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 52

ఉ॥ మోదముగోరి ఖేదమున మున్గెడువాదము సేయుచుందు) భా
ర్యా దయితుల్ శతమ్మునను నారయఁ దొంబది మందియుట్లుఁ గా
కే దొరయించు మీకు జగమెల్లర కీవు భవాని సేయు సం
వాదము మోదమున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 53

ఉ॥ నీరము గ్రోలునప్పుడును నిల్చినయప్డు భుజించునప్డు సం
చారము సేయునప్పుడు ప్రసంగమునం దిగినప్డు శయ్యకుం
జేరినయప్డు నీయెడనె చిత్తముహత్తగ నిమ్ము నాకొగిన్
వారక నిత్యముం బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 54

ఉ॥ న్యూనతకోర్చి దుష్కృతులు నూర్లకొలందియొనర్చుచున్ సదా
మానుల నేచు నీచులను మంచెదు ద్రుంచెద వాయువగ్గలం
బై నెగడంగ నీయక నయజ్ఞుల నిట్లొనరింప నేటికో
వైనము దెల్పరా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 55

ఉ॥ నేరక నీచులంగలసి నీచుఁడనై సముపార్చుకొంటి పెం
దారుణ పాతకవ్రజము దానిఁగుజమ్ము గజమ్ముమాడ్కి సం
హారముసేయు దంచని మదారి విదారిని నిన్నుఁ జేరితిన్
వారిజభూనుతా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 56

ఉ॥ ఏరికి నీవయిత్తుగద యీప్సితముల్ శతముల్ గుమారు బోల్
మారు గుమారు నాకొసఁగు మాయనఁ బూర్వముచక్రముం బలెన్
గోరినయంత నే తనయుఁ గూరిమి నీవువె పూర్వదేవతా
వైరికి శౌరికిన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 57

ఉ॥ ఆర్యహితుండవైన భవదాజ్ఞకు బద్ధము గాక నాకపా
హార్యముతోడ నీడగుట కై గ్రహమార్గము లాక్రమించి త
త్కార్యము నన్ ఘటోద్భవు కతమ్మునఁ బాయదె వింధ్యభూమి భృ
ద్వర్యము వీర్యముం బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 58

ఉ॥ దుర్గమ దుర్గభూమి గుణధుర్యుని నిన్ను గుణించి నీకు సం
సర్గము గోరితాఁ దపము సల్పిన మేను సగంబొసంగి స
న్మార్గులు మెచ్చ నేలితివి మానితదానకళా వినిర్జిత
స్వర్గ విభార్గవిం బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 59

ఉ॥ సంశయ ముజ్జగించి సురసత్తము నిన్మది నుంచి యే యుప
భ్రంశము లేక కొల్వఁగల భవ్యుఁ డొకానొకఁ డుండు నాతఁడే
వంశములోనఁ దాను బ్రభవంబగు నో విభవాతిలోక మా
వంశ మఘేతరా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 60

ఉ॥ చారువిచార లౌగణక సత్తములందఱు నట్టులుండ నీ
వారిజ పాణికిన్ రుచిర వాణికి నయ్యజు రాణికేనియున్
బారములేని నీ సుగుణ పాళిగణింపఁగ శక్యమౌనఁటే
వారణ వారణా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 61

ఉ। కోడె మిటారి యటా కుసుమ కోమలి యోష్ఠర సమ్మకంబె నే
నాడును రుచ్యమై పస దనర్చెడు తావకనామ సారమున్
బాడిమెయిన్ గుణమ్ము లెఱిఁగి పానము నర్చెడు నీతిశాలి యె
వ్వాఁడును వీడునే పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 62

ఉ॥ అంకిలి యెట్టిదో యెఱుఁగ నట్టి సుఖమ్మన యమ్మనిచ్చి యే
పంకము సోఁకనీక పరిపాలన సేయుచు నంచునచ్చి నీ
కింకరుఁడైతి నాయలఁత గెంటుము గెంటవయేని నింక నీ
వంకఁ గనుంగొనన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 63

ఉ। నెమ్మదిఁ దద్జ్ఞ చిత్తముల నీవెడబాయక నిల్చియుండు పా
కమ్ములు శయ్యలుం ధ్వనులు కల్పనలున్ సముయానుకూల భా
వమ్ములు వ్యంగ్యముల్ గలిగి వార్తకునెక్కిన హృద్యపద్య కా
వ్యమ్ము విధమ్మునన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 64

ఉ॥ ఓ కరుణాకరా గుణపయోధి నతావన విశ్వభావనా
కోకవిపక్ష శేఖర ముకుందహితా కరిచర్మచేల సు
శ్లోక చరిత్ర నన్విగత శోకునిఁజేయుము నీకిదే నమో
వాకమొనర్చెదన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 65

ఉ॥ లాభములేను సుంతయుఁ దలంపఁగ లోభ గుణావలంబినై
ప్రాభవ హానికిం దొలఁగఁ బాటక యూరక వ్యర్థవాదినై
శోభనవృత్తి నిన్ గొలువఁ జూడని సుంతకు హా త్రిసృష్టి యా
వైభవ మోభవా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 66

ఉ॥ కొందఱు బ్రహ్మయంచు మఱికొందఱు విష్ణుఁడటంచు వేఱుగాఁ
గొందఱు శంకరుండనుచుఁ గొనినను న్వినుతింతు శ్రీప్రస
య్యందఱి కన్నిరూపముల నాద్యుతిమైఁ గనుపింతు పూని రా
డ్వందన నందనా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 67

ఉ॥ ఫణధరా పరాత్పర మహేశ్వర యాత్మ భాస్వరోగ్ర కం
ఖాణ నదీనతూణ మురఘస్మరబాణ సుశాణ శ్రితప్రజ
త్రాణ దయాఘుణ నరరంజితబాణ ఘుణింపునాను ని
ర్వాణము రాణమై పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 68

ఉ॥ సారెకుఁ దావకస్మరణ సల్పుమనుంటి సదీప్సితార్థముల్
గోరక మున్నయిత్తువని కోరెనుఁ గూడ నొసంగవైతి హా
రౌర యిఁకెట్లు లేప నిను నాఁటిడి పాపొసరింతు నీను నీ
వారికి జంక నూ పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 69

ఉ॥ మానము దాయఁగా సుజన మాన్యునిఁగా జితవైరిఁగా హత
త్రాసునిఁగా లసద్గుణ నిధానునిఁగా నెసగింతుగా భవ
ద్దాసుఁడనైన నన్ను నెపు ధైర్యము నీయెడ నాకు లేద వి
శ్వాసము వీసమున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 70

ఉ॥ ముందెట నెప్పుడెట్టి భవముల్ గనియుంటినో యెట్లు మాంటినో
యిందిపు డిట్టు లుంటి నిఁక యేచు భవవ్యధ సైపనోప నీ
పొందిడుమంటి తొంటి భవపుంజము గొంటి భవాప్తు నన్ను బ్రో
వందగు వింటివా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 71

ఉ॥ ఆద్యము దానయై గణన కందని యాయుయ కోటినెల్ల సం
పాద్యము సేయుచుం గడిఁది బాధలువెట్టుచు నెట్లువచ్చెనో
వేద్యముగాక సర్వులను వేచు భవంబను వ్యాధిమాన్పఁగా
వైద్యుఁడ వీవెకా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 72

ఉ॥ కర్తవు గావునన్ మనవిగా వినుతున్ విను మద్విరోధులన్
బూర్తిగ రూపుమాపి యఘ పూగము రోగముఁ బాపియోపి నీ
మూర్తినిఁ జూపి నీయెడ సమోఘపుఁదీపి ఘటింపుమయ్య దు
ర్వర్తన కర్తనా పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 73

ఉ॥ నైరములేక యేకమతి వారిజనేత్రుని నిన్నుఁ బన్నుగాఁ
గోరి నుతించువారి కొనగోటికి సాటికి నేరు రారిలన్
నీరజసంభవ ప్రముఖ నిర్జర బృందమె సాక్షిదీనికిన్
వారణ దారణా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 74

ఉ॥ కాలుఁడు కాలపాశమునఁ గట్టి మృకండుని పట్టి పట్టి హుంక్రియా
భీలతఁ బట్టిరా దిగువ బెగ్గలమగ్గల ముందియాతఁడో
కాల గళా ననుంగరుణఁ గావుము నా జముదాచి ప్రోచితో
వాలు మగంటిమిన్ బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 75

ఉ॥ లోకము సర్వ మంబునిధి లోపల డిందిస నేడు సాగరా
లేకము సెందినన్ రవియు నింముఁ డుందో వలు దప్పి వచ్చినన్
సైకము గాని మైకము మనంబునఁ జొచ్చిన బొంకొకంత నీ
వాకునఁ సోకునా పెసరవాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 76

ఉ॥ వక్రపథంబునన్ మెలఁగు వాని మహాకవి నేనిసైప వీ
వక్రమవృత్తి విత్తపతి యర్థము గైకొని నట్టి తుచ్ఛుఁడో
శుక్రునిఁ దత్ఫలంబు చవి సూడఁగఁ జేయవె వైరిదారణా
వక్ర పరాక్రమా పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 77

ఉ॥ మంచిగ నీవ దిక్కనుచు మానక చీటికి మాటికెంత గీ
ర్తించినఁ జేరవచ్చివగ దీర్పవు మోదము గూర్పవయ్యయో
మంచికి మంచి లేద నెను మాటకు నూఁకువ గాకు సాఁకు ని
ర్వంచిత లీలనన్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 78

ఉ॥ ఊహయొనర్ప నీహృదయ మొక్కఁడ గాదవ దాత నైభవో
దాహరణంబు దాము నిదర్శనముల్ భవదంఘ్రి భూష శే
షాహి కిరీట బుక్షు పకలాళి శిరస్థిత గాఁగ దేహముల్
వాహము గేహముల్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 79

ఉ॥ నేరము నీది యే తలప నేరముగాక విపత్పరం పరల్
దూరము సేసెదమ్ము దయతోఁ యంత నేలమి నీవి నేరమా
నేరము సైచి సాఁకుమని నిత్యము మే మొఱలించుచున్న నై
వారము నేరమా బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 80

ఉ॥ మారహరా హరా త్రిపురమర్దన శూలధరా గిరీశ గౌ
రీ రమణా యటంచు బహు రీతుల బూతుల బుంగినయ్య నీ
చారుత రాభిధల్ సువవ సాఁగితి నీఁగితి నింకఁ బుట్టుగుల్
వారణ మారణా బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 81

ఉ॥ ఈడిడరాని నీ కరుణ కెవ్వఁడు పాత్రముగాఁ జరించునో
వాఁడె యశస్వి వాఁడె ధని వాఁడె పవిత్రుఁడు వాఁడె గణ్యుఁడున్
వాఁడె వివేకి వాఁడె సుఖి వాఁడె గుణాఢ్యుఁడు వాఁడె బుణ్యుఁడున్
వాఁడె కృతార్థుఁడున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 82

ఉ॥ నీ కెన నీవయౌ ననుచు నిత్యము సత్యము గా మనమ్మునన్
దేఁకువఁ బాయనీక వినుతించెడు వారికి నీవు నీవమై
శోకము మాపి పాతకము జోపి భయంబెడఁ బాపి కూర్తు హే
వాకవి పాకమున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 83

ఉ॥ రమ్ము మదీయవాంఛితము రాయిడిసేయక గూర్మి హెచ్చఁగా
నిమ్ము ధనమ్ము గోరను మఱేదియుఁ గోరను మోక్ష మొక్కఁడే
సుమ్ము నిజమ్ము నమ్ము సుయశోధన సాధన మర్థికోర్కి స
వ్యమ్ముగఁ దీర్చుటో పెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 84

ఉ॥ ఇంతయు నీవు భాసట సహించుట గాంచినయుష్టి యెంతయున్
గాంతము శాంతమీ జగము గానదనీవు సహాయమున్ సహా
యాంతర మింక లేనిఁగను సాతము గింతయు లేని సంతత
ధ్వాంతము భ్రాంతమున్ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 85

ఉ॥ ఏడను సాగనీక కుదియించి నినున్ గదియించి యుంచినన్
వేడుకతో మనంబు సరవింబడ యుంగనుఁ గావె యోగినన్
గాఁడక నిన్ను నీడక సఖండసుఖంబుల గల్గ నెల్లయో
వాఁడిమి పోఁడిమిన్ బెసర వాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 86

ఉ॥ కొంకక దేశికోత్తముని కోమలిఁ బట్టి రమించినట్టి యు
ష్పంకజవైరి నీయడుగు పట్టిన నెట్టులఁ దాల్పవే శిరో
లంకృతిగాఁ దలన్ నినుఁ దలంచుట సూతుపు గాని చూడవే
వంకర టింకరల్ పెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 87

ఉ॥ త్రాసము వీస మాశ్రితులఁ దాఁకఁగ నీయక బ్రోచు సంతతో
ల్లాసుని నిన్ను నిత్య మకలంక మతిన్ స్తుతియించు భాగ్యమే
లా సమకూరుఁ బద్మజుని యంతటివానికి నేనియుం జను
ర్వాసన లేనిచోఁ బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 88

ఉ॥ పాతకవృత్తియే దమకు బట్టకుఁ బొట్టకుఁగాఁ జరించు మద్
జ్ఞాతులు నన్నుఁ గూర్చి యొకసక్కెము లాడెద రేనువారిలోఁ
బాతికపాలు సేయఁగద పాతక మేటికొ వారి కిట్టిచో
వాతులు పుచ్చవో పెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 89

ఉ॥ వేసర కారయం బుడమి వేలు పవిత్రములైన క్షేత్రముల్
భాసిలు నీ నివాసమునఁ బావనమై తనయందుఁ గాలముం
జేసిన వారిముక్తిగనఁ జేసెడుచో నెన యెట్టులెవ్వియున్
వాసిని గాశికిన్ బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా ! 90

ఉ॥ గర్వికి నేని నీ శ్రితుఁడు గ్రిచ్చుట మేల యొకర్వుఁ జూచుఁ ద్వ
త్పర్వతముం బగుల్పఁ బగ వట్టి దశాననుఁ డార్తుఁడౌట కుం
బూర్వమె సేయలేదె నయబోధ తదీయశుభంబు పొంటె నీ
వార్వము సర్వమున్ బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా ! 91

ఉ॥ దుర్మద శత్రుసైన్యములఁ దుంచి యమృశ్యుఁడనై కిరీటికిన్
బేర్మి జయంబొసంగినది నీవ నిజాబునఁ దామొసంగ నే
కార్ముకమున్ శతాంగమును కాండములున్ వివిధాస్త్రశస్త్రముల్
వర్మముఁ గేతువున్ బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 92

ఉ॥ నీ సహజమ్ముగాఁ గనిన నిస్తుల విశ్వవిభుత్వ మాత్మలో
రోసిన నందిగుంది కనరుంగొని కొంత కలంత గూర్ప న
గ్గాసికి లొంగినిన్ను బహుకాలము మూలమెటింగి కొల్వఁడే
వ్యాసుఁడు దాసుఁడై పెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా ! 93

ఉ॥ స్ఫాతిగ దీనరక్షణము సల్పుట సాజముసుమ్ము నీకు సం
ధ్యా తనయాతనూభవుని యౌవనమున్ దివిజత్వమున్ దిశా
వ్రాత జితోరుశక్తి ఖచరత్పురముం దొరకొల్పి నీకు నీ
వైతనరింపవే బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా ! 94

ఉ॥ దానవవైరితో దురము దగ్రతఁ జేయుగ నేగు బాణుతో
మానక నీవు నేగితివి మానము న్యూనము గంటకోర్చి కీ
డైన సహించి తోడ్పడె దహా భవదీయ పదానుజీవి యౌ
వానికి దేనికిన్ బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా ! 95

ఉ॥ వింతగఁ జిత్రకేతు పృథివీపతి నిన్నభ నెగ్గువల్కి నీ
కాంత దురంత శాపమిడెఁ గాని కలంగవు నీవుసుంత నీ
స్వాంతము శాంతమున్ సుజన సంచయసన్నుత విస్ఫుర ద్దయా
వంతముఁ గాంతమున్ బెసరవాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 96

ఉ॥ ఏ నరుఁడెద్ది యిమ్మనిన నిచ్చుట సచ్చుటఁ జేసి కాదటే
యానరుఁ డిచ్ఛయించెను ద్వదస్త్రము దాని సటుండనిమ్మ ని
న్నైనన నొసంగుదీవు సమయస్థితి మేలది నీక కాద యె
వ్వానికి దానికిం బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 97

ఉ॥ దారిదియంచు దేశికుఁడు దావచియించిన మాత్ర విద్య లో
సారము సర్వముం దెలిసి సాధుమతిన్ నినుఁ గొల్చివిచ్చి సం
సారము పారముం దొలయఁ జాలరయేని మహేశభేద మ
వ్వారికిఁ గీరికిం బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 98

ఉ॥ ఏ నియమంబుఁ బూనుకొని యెంతొ నివాసము జేసియెంతగా
దేనికి దేనికై నిను మదిం గదియించి భజించు చుండుగో
దానికి దానికిం దగు విధమ్ము ఫలమ్ము లొసంగ నేర్తు వౌ
వానికి వానికిం బెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 99

ఉ॥ శంకర శంకరా యను వశంకరు నేలుట కింతజాగు నా
వంకర వంకరా శ్రితుని పంకరు బ్రాలుట బాణదైత్య రా
ట్కింకర కింకరా యొకటికిం బనివేతును వీఁడటంచు స
ర్వంకర యింకరా పెసరవాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 100

ఉ॥ క్రూరములైన బాధలు దగుల్కొని నన్నలయించుచుండె దు
ర్వారములై బయింబయి త్వరం జనుదెంచి సుఖంబొసంగరా
మారహరా యటంచు బలు మాఱులు సీఱిన రావు నేరమా
నైరమ భారమా పెసర వాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 101

ఉ॥ తానునుఁ దావకాంశజుఁడు దక్షుఁడ నీవలె దేనికింబయో
జానన జానకిన్ వెదకు నప్పుడు వార్ధిగమింప సంజనా
సూనునిఁ దక్క నక్కపులు శోధనఁ జేసి యశోధనాఢ్యుఁడౌ
వానరుఁ గానరుం బెసర వాయిపురస్థిత త్ర్యంబకేశ్వరా! 102

ఉ॥ సర్వము సర్వమానవుల సువ్వులకుం దగ మెచ్చియిచ్చి దు
ర్గర్వము నెందుచో నుడిపి కావగ నేవగ నీవె కావె ది
క్కుర్వర వారి దిక్కనఁగ నొప్పుసదెట్లు స్వతంత్రహీనులౌ
స్వర్వరు గీర్వరుల్ బెసరవాయి పురస్థిత త్ర్యంబకేశ్వరా! 103

ఉ॥ సత్వగుణంబ యూఁతగ నెసంగి గురూత్తముఁ జేరి చేయుచున్
దత్వవిచారముం బరతత్వముగా నిను గుర్తెరింగి రా
గిత్వమువాసి వాసిఁ బులకించు మహాత్మ శాలికేల దే
వత్వము కాల్పనా పెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 104

ఉ॥ వీఁక ననేకవృత్తముల వెల్గుచుఁ బూడియు నేకవృత్తతన్
జోఁక నెసంగుసీమఁ దగు చొప్పున నేనుసు నేకవృత్తి మే
నేకొని నేర్పుభంగి విరచించితి నీ శతకమ్ము గొమ్ము దే
వా కుతుకమ్మున బెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 105

ఉ॥ ఆకమలారి తారక దినాకర మాకరమై పొగడ్తకున్
బ్రాకట వాంఛితార్థములు పాఠకపాళి కొసంగుచుండెడున్
గాక సురాగమట్లు శతకంబిది నీ దయనూని మాని సే
వ్యాకవివర్ణితా పెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 106

ఉ॥ కేసనపల్లి వాసుఁడను గేసనపల్లి కులంబు లక్ష్మణా
ఖ్యాసహితుండఁ దావకపదార్చన తత్పర మానసుండ నే
జేసిన దోసముల్ వొలియఁ జేసి కరమ్ము వరమ్ము లీయరా
వాసవ వందితా పెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 107

ఉ॥ మంగళ మద్రిజారమణ మంగళ మండజ రాడ్విభూషణా
మంగళ మంబుజాక్ష సఖ మంగళమంగజ గర్వభంజకా
మంగళ మాద్రితేయనుత మంగళమెప్పుడు గాతసేను స
ర్వాంగత సంగతా పెసరవాయిపుర స్థిత త్ర్యంబకేశ్వరా! 108

## గద్యము.

ఇది శ్రీ మదాంజనేయానుగ్రహాప లబ్ధ సరస కవితా సామ్రా
జ్యాధి వైభవ రమా నాథాభి ధేయ ద్వితీయ తనూభవ
వికట వాద పరాయణాతి భీకర వినయ సమిత
సుకర వశీకర లాక్షణిక జన విధేయ లక్ష్మ్ణా
నామధేయ ప్రణీతంబయిన పెసరవాయి
పురస్థిత త్ర్యంబకేశ్వర శతకము
సంపూర్ణము.

